శ్రీరస్తు

శ్రీ వరదరాజ పరబ్రహ్మణేనమః

# శ్రీ వరదరాజశతకము.

---

ఇది

శ్రీ భగవద్భక్తుల[illegible]

పామర పండితుల కత్యంతోపయుక్త[illegible]ల

[illegible] బాలికాపాఠశాల

ప్రథమోపాధ్యాయుడగు

## ఏగసిరి వెంకటపతిచే

రచియింపబడినది.



పబ్లిషరు

## యినుకొండ వెంకట్రాజు.

[illegible]లక్ష్మీ బుక్ డిపో, ఇన్నీసుపేట, రాజమండ్రి.

---

రాజమండ్రి కందుల సూర్యారావు బ్రదర్సువారి

రామమోహన ముద్రాశాల యందు

ముద్రితము.

1936

శ్రీరస్తు.

# శ్రీ వరదరాజశతకము.



శ్రీలకు మూలమైచె గు శీలరమామణిలోల వేణుగో
పాల యశోదబాల రఘుపాల మహాద్భుతలీలమేల నీ
జాలమదేల నేల మదిచాల కుతూహాల నీలవర్ణ భూ
పాల యశోవిశాల సురపాలన శ్రీవరదా మహాప్రభో. 1

చదువరి వంశసంభవుడ సద్గుణయత్రిమునీశు గోత్రుడన్
ముదితయు వెంకమాంబ తనమూర్తియు రంగన పుత్రుడారయ
న్విదిత భవత్ప్రసాదమున వెల్గెడి వేంకట నామధేయుడ
న్మృదముగ జెప్పుపద్యముల మోదిత శ్రీవరదా మహాప్రభో. 2

దినమును నీదయామృతము దివ్యఫలంబని యెంచిభక్తియు
న్ఘనమువహించ నీదు శతకంబు రచించితి దేవనాథ నా
వినయము పూర్ణమై చెలగువిన్నపమెల్ల ముదంబుగా జెవి
న్వినిమరి సత్ఫలంబొసగు వేగమే శ్రీవరదా మహాప్రభో. 3

మించినవాడగాను నినుమేలని యెంచి నుతించి వచ్చితి
న్కాచిపురంబు నేలికలకాలము సాధులగాచి ప్రీతిగా
వించి చెలంగు నాథుడవు వేల్పులపాలిటి సొమ్మునీవె భా
వించి ముదంబొసంగుమని వేడితి శ్రీవరదా మహాప్రభో. 4

లోకచరాచరంబులకులోని వసించి కృపాసముద్రుడై
శోకములెల్ల బాపి బలుసొంపు కుతూహలమొంది మేలుగా
చేకొను నీపదాబ్జముల సేవ ప్రభావముగాదె నిత్యము
న్నాకపురీశగావు మెడబాయక శ్రీవరదా మహాప్రభో. 5

నవరసముల్చెలంగ రఘునాయకుడై భువినేలిదుష్టుల
న్దవిలిరణంబుల న్దునిమి తాపసవర్గము సంతసించు నీ
సవరణజెప్ప నాదరమెచయ్యన గాచిముదంబొసంగినా
భవములు బారదోలు మిక పండిత శ్రీవరదా మహాప్రభో. 6

మేలొనరించ నీవె నినుమించినవారు జగానగాననీ
పాలువిధేయుడైన నను పాలనసేయు కృపాపయోధియో
వేళకృతాపరాధుడ వివేకులీనుడటంచు యెంచి న
న్నేలుటమానవాదు మహినేర్పరి శ్రీవరదా మహాప్రభో. 7

గోపకులాబ్ధి చంద్రవరగోపకుమారులగూడి గోవుల
న్మేపి విరించి నిన్బొగడ మెప్పువహించి దలంచినీదయా
జూపువిశేష మందుగల శోభనలాభమొసంగి వేగనా
పాపముదోలిగావు సులభంబుగ శ్రీవరదా మహాప్రభో. 8

కుంతికుమార వర్గములు గోరి నుతింపగ్రహించినంతట
న్చెంతనెయుండి నిర్జరులుజేయన వారలవృద్ధిజేయు నీ
వెంతపరోపకార ప్రభువేదమెరుంగు భవత్ప్రతాపము
ల్చింతనజేతునయ్య దయజేయుము శ్రీవరదా మహాప్రభో.

పలినమూర్తి నీవనుచు యెంచి పదాబ్జము నమ్మి గొల్చెద
న్నేలునొసంగు తక్షణము మెప్పులకుప్పవు లోకమంతయు
న్నాలన జేయురక్షక శుభంబులొసంగు చరిత్రమిత్రనీ
కేల వరాకుగావనను కేశవ శ్రీవరదా మహాప్రభో. 10

వీరుడవైన నద్దెసలు వెల్గజయించు ప్రతాపమొంది పొం
గారు బలాఢ్యుడైన విశిఖంబులపాణియునైన నీదయా
పారమొకింత లేకరఘుయశాలియునందగు పేరు గల్గునే
కారణకర్తవన్నిటికి గావుము శ్రీవరదా మహాప్రభో. 11

దశరథరాజు నిన్గొలిచి ధర్మకుమారులు నల్వురొందె గా
వెసభవదీయ నద్భుతము వేల్పులుమెచ్చి నుతించునట్టి నీ
కుశలదయా విశేషముల గొప్పయు జెప్పగనెంతవాడ నా
దెనకరుణించిగావు విజితేంద్రియ శ్రీవరదా మహాప్రభో. 12

నీదుచరిత్ర మీభువియు నీరజబాంధవుడిందు తారక
ల్వేదములుండుదాక రఘువీర కులాంబుధి చంద్రమూర్తిముదం
బొందగబుట్టి వెల్గితివి భూరమణుండవు నాదుకోరిక
ల్జెందిసుఖంప జేయుమిక చేకొని శ్రీవరదా మహాప్రభో. 13

నేరములెన్ని జేసి జననిందల బొందెడి జన్మమెత్తితి
న్సారములేని జన్మమిది సారసనేత్ర పవిత్రమిత్ర నీ
భారమునాదుకష్టములు బారగదోలి ఫలంబొసంగుమా
వేరెవరయ్య రక్షకులు వెండియు శ్రీవరదా మహాప్రభో. 14

ఇచ్చినదాతనీవె మదిమెచ్చి హితంబుగనాదుశక్తియు
న్మచ్చిక సర్వము న్దెలిసి మంచిదెయిప్పుడు దీసివేయుట
న్సచ్చరితుండవీవు ఘనసాధనమూర్తివి గానయింపుగ
న్వచ్చి కుతూహలంబొసగు వందిత శ్రీవరదా మహాప్రభో. 15

నమ్మితినామనంబున జనార్దన నీదుపదారవిందము
ల్నమ్మిక చిత్తగించి సుగుణంబున సత్కృపజూచి మెప్పుగా
న్గొమ్మవిధేయుడైన ననుగొబ్బునగాచి ఫలంబుబొంద రా
నిమ్ము్మయశోవిశాల రమణీధర శ్రీవరదా మహాప్రభో. 16

గలవని యెంచి గొల్చితి జగంబుననాదు లిలాపమంతయు
న్దెలిసికృపాసముద్రమున దేలనొనర్చి మదీయకోరిక
ల్గలిగి సుఖింపజేయుటకు కర్తవుజూడగ నత్యమీాదర
న్బలరిపుదానవ ప్రముఖభంజన శ్రీవరదా మహాప్రభో. 17

ఏనుభజింపసత్పదములిచ్చిన బుద్ధిక్రియన్ముదంబుగ
న్బానిలిఖించితి న్విజయభూరమణుండవు చిత్తగించి నా
మానముగాచి సత్ఫలముమానకనిచ్చి హితంబొనర్పుమా
నూనశరాత్రి యాజనకసుందర శ్రీవరదా మహాప్రభో. 18

కలతలుబెట్టగావలదు కామితమెల్ల నొసంగునాధనే
పలుమరు వేడుకొంటి పదపద్మయుగంబుల బ్రోవగావలె
న్గులుకుమిత్రారి ద్రౌపతికి కోరికలిచ్చినమాటక్రి నీదయా
తిలకవిశాలనేత్రములదీప్తిని శ్రీవరదా మహాప్రభో. 19

కృపగలదేవుడంచు నినురూఢిగనమ్మితి దిక్కునీవె నా
సఫలమొసంగు సద్గుణవిశాల ప్రభావచరిత్రమిత్ర మా
తపజపయోగదానములు ధర్మముజేయ నశక్తుడైతి నీ
శుభకరవీక్షణంబులచె జూడుము శ్రీవరదా మహాప్రభో. 20

శుభములొసంగునాథుడవు శోభనమూర్తివటంచుసత్కవు
ల్విపులతవృత్తిగీతములవేడ్క నినున్గొనియాడదృప్తుడై
సఫలములిచ్చిగాచితివి చయ్యనదీనశరణ్యగణ్యనే
చపలుడగాన బ్రోవు సురసన్నుత శ్రీవరదా మహాప్రభో. 21

కరిమొరనాలకించి మరిగాచితి వంమురు తక్షణంబున
ధ్వరవరభక్తవత్సల సుదారగుణాకర నీపదాబ్జము
ల్స్థిరముగ నమ్మిగొల్చెదను ధీనిధనా వెసజూచినీదయా
కరమతి నేలికావుము జగంబున శ్రీవరదా మహాప్రభో. 22

కలతలమాన్పి గావుమని గట్టిగ నేమొరబెట్టిజెప్పితి
నకలతలవృద్ధి జేయుటకు కారణమేమొ యెఱుంగలేను నా
కలతలు నీవెరింగినదెగాన తిరంబునశింపజేయుమా
కలతలనాశకారి దళకర్తవు శ్రీవరదా మహాప్రభో. 23

ధనమభివృద్ధి యీకవినిదప్పక మర్త్యులకెల్లజూడగా
ఘనమధికంబుగల్గు నిదిగానవె పాలనమూర్తి నీవె నా
మనవిని చిత్తగించి ననుమానము లేక ఫలంబులిచ్చి యీ
తనువునుగావు మయ్య వరదాతవు శ్రీవరదా మహాప్రభో. 24

పలుమఱ వేడుకొంటి భవబంధ విమోచన పద్మలోచనా
తిలకచరిత్ర యీభువన దేవుడు నీవె మదీయపాపము
ల్తొలగ భవత్పదాబ్జముల ధూళియొసంగి కృతార్థు జేయుమా
చెలగు కృపాపయోధి సురసేవిత శ్రీవరదా మహాప్రభో. 25

జేసితిపాపమీభువిని జేసితి పెద్దలనింద పొందు నే
జేసితియన్య దారలను జేసితి దుష్టులచెల్మి జూడ నే
జేసినదప్పుల న్దలచి జేయకు శిక్షరమాలినోదనే
జేసెదనయ్య నీభజన శీలుడ శ్రీవరదా మహాప్రభో. 26

దాతవటంచు నమ్మితి సుధాకర ధారణమిత్ర పంచస
ద్భూతములెల్ల నీవెనినుఁబొందు చరాచర మద్భుతంబుగా
నాతలితండ్రి బంధు జననాథుడు నీదువరాహ మాంనినీ
చేతినిబట్టి బ్రోచిదయ జేయుము శ్రీవదా మహాప్రభో. 27

సాగరకన్య నాజనని చయ్యననీకడ కేగుదెంచి న
న్నేగిరమేలిగావుమని విన్నప మొక్కటియిచ్చి జెప్పగా
నీగతి చింతవాతబడి నీల్గకనాదెస జూచిబ్రోవుమా
భోగమొసంగి సత్కరుణ భూషణ శ్రీవరదా మహాప్రభో. 28

దశమగు వేషముల్ వినిదాలిచి భక్తులపాలికష్టము
ల్వాసజెడి బారదోలితివి వేల్పులు సంతసమొందగాను నా
దెసదయ జూచి యాకలతదీర్పుము పాపవినాశకేశవా
కుశలమొసంగు రక్షకుడ గోరితి శ్రీవరదా మహాప్రభో. 29

పరమదయా స్వరూపుడని పల్మరు నేమొరబెట్టుకొంటి నీ
కరుణము నన్నుగాచుటకు ధర్మప్రభుండవు భక్తవత్సలా
వరసగుణాను కూలమగుసత్ఫల మిచ్చిబిరానవచ్చి నా
వెరపుకృశింప జేయుమిక వేడితి శ్రీవరదా మహాప్రభో. 30

పాపసమూహ సంహార భక్తవరాయణ గోగణంబులు
న్గోపకుమార వర్గములగూడి శుభంబుగనేలి నీదయ
న్జూపిచెలంగు నద్భుతము చోద్యముగాదె మదీయచింతన
ల్బాపియొసంగు సత్ఫలము బాగుగ శ్రీవరదా మహాప్రభో. 31

ఎంచకరాని ప్రేమమున నేవెస నీదు పదారవిందము
ల్మించినదేది లేదనుచు మేలుగ గోరినుతించు వాడ నీ
మంచిప్రియా ప్రసాదమనుమానము లేక నొసంగుమయ్యనా
సంచితఖర్మము ల్దొలగచయ్యన శ్రీవరదా మహాప్రభో. 32

పరమదయానిధీయనుచు భావమునందిడి నేనుతించె దీ
న్మరువక నీప్రియంబాలుక మన్ననజేసి హితంబొసంగుమీ
కరుణము సారసాక్షుడవు ధర్మమెఱుంగుప్రభావదేవని
స్థిరముగ నమ్మినాడ మరిదిక్కని శ్రీవరదా మహాప్రభో. 33

నమ్మినవారిలో నెవరు నాశముబొందిరి భూమియందు నా
నమ్మకలేమి జేసెదవొ నాథ పరాత్పర పాహిపాహి నే
నమ్మియొసంగు విన్నపమున నలసారమెరింగి ప్రోవుమా
నమ్మితినీపదద్వయము నాపతి శ్రీవరదా మహాప్రభో. 34

నాదుకళేబరంబునకు నాథుడవై నివసించియుండి స
ద్బోధనజేయు నావిధముబూని చరించితిగాదెనిత్యము
న్భేదమదేలనాయెడల బిలిచియొసంగుము సత్ఫలంబిలన్
బాధలతాళజాలనిక పండిత శ్రీవరదా మహాప్రభో. 35

ఇలసరివారు నన్నులకనెంచ కొనర్చుటనీతిగాదు నీ
వలనవిధింపనీ భువినివచ్చిచరించెడి వాడగాన నా
ఫలము ఋయుంబులొందుటకు పాలనసేయుము బాలలీలగో
కులతిలకాన్వయాభరణ కూరిమి శ్రీవరదా మహాప్రభో. 36

పలుమరువేడనిచ్చినది పావనమూర్తివి నీవెగాదె నే
తులువనటంచుమొంచినది తూలగజేసితివో కృపాకరా
తిలకులుఇట్లొనర్చుదురె ధీనిధిపుంగవ మేలుగాదునా
కలతలు దీర్పనీవెగతిగన్గొను శ్రీవరదా మహాప్రభో. 37

చిక్కులచేతగుందితివిజేశప్రకాశ రమేశకానలో
రెక్కలులేనిపక్షిగతి రేయిపగల్గలకాలమెల్ల నీ
పక్కబలంబుచేత ననుబట్టిహితంబుగ నేలవయ్య నే
పెక్కువిధంబువేడితిని పేర్మిని శ్రీవరదా మహాప్రభో. 38

వేదనదీర్చుదాతయని వేమరునిన్గొనికూడివేడితి
న్మోదమొసంగమెంచిన ప్రమోదముగాదు త్రిలోకసుందరా
ఖేదమొనర్చరాదు ధరబిడ్డలనేరము లెంచన్యాయమా
నీదుపదంబులాశ్రితుడనేలుము శ్రీవరదా మహాప్రభో. 39

ఎవ్వరిసత్కటాక్షములచే నొకపూరుషజన్మమొందితి
న్నెవ్వరినిత్యపోషణము నేనిటువర్ధిలకారణంబిల
న్నెవ్వరిదిక్కు నీవెగద వింతగజూచుట మేరగాదు యిం
కెవ్వరుదెల్పుమయ్య మదికింపగు శ్రీవరదా మహాప్రభో. 40

పెన్నిధిగన్న పేదక్రియ పేర్మినుతించెద నీదునామము
ల్కన్నడ సేయరామకడకన్నుల జూచిప్రియంబు చేతనా
విన్నప మాలకించి మదివైభవ మొప్పగ సత్కరించి బే
రొక్కన్న ఫలంబొసంగు మరిగోరితి శ్రీవరదా మహాప్రభో. 41

కోరికలిచ్చుదాత యనిగోరి భజించితి రేబగల్లునా
నేరములెంచగా వలదునీదయచేత మదీయనీప్సితం
భారసియిచ్చి నేలు పరిపాలనమూర్తివి నీవుగాననా
ఘోరభవంబుదీర్చి మరిగొబ్బున శ్రీవరదా మహాప్రభో. 42

పగచెదభీతుడై మదిని వాసవవందిత కూర్మిచేత నా
పగతులెల్ల శోషణవిభవ్యతరంబ భయంబొంసగుమా
నిగమచరాచరంబులకు నిర్జరకోట్లకు మూలకారణా
తగుదువునన్నుబ్రోచుటకు తధ్యము శ్రీవరదా మహాప్రభో. 43

సందియ మేలచాలబడు సంకటమెల్ల నెరుంగునాథుడై
వందితుడై చెలంగి భవవార్ధము నింగిపరాతలంబునన్
నిందితుడైన నామనవినిమ్మతి నీ చెవిబెట్టిగోరిక
ల్జెందవరంబులిచ్చి దయజేయుము శ్రీవరదా మహాప్రభో. 44

దీనజనాను కూలుడవు దివ్యసరోజదళాయ తాక్షనా
మానముబోయి ప్రాణమిక మానకబొంది నియుండబాడియే
గానవిలోల ప్రాణమునకంటెను మానముగొప్పదయ్య స
న్మానమునిల్వనేలు మికమాధవ శ్రీవరదా మహాప్రభో. 45

చేతికినిచ్చి దానిలెవి జేసితిమయ్య యిదేటి చోద్యమో
పూతదొలంగు మాటక్కదయ భూషణ కారణమే మొగాని ప్ర
ఖ్యాతివహింప నీవఖిలయాపద బాపి హితంబొనర్చుమా
నాతలితండ్రి నీవెయని నమ్మితి శ్రీవరదా మహిప్రభో. 46

సకలము నీవెరుంగుదువు సాధ్యముగాదు నెరుంగ నేరికి
న్నికమునగోచరంబు మదిరంజిలుశక్తి మపారమీధర
న్సుఖములు దుఃఖములొన్నసగుసూత్రము నీదెమహానుభావమా
సకనన్బ్రోవ నవెగతినాయక శ్రీవరదా మహాప్రభో. 47

నీదయ నాయెడన్గలిగినిత్యము గోర్కెలొసంగుమంటి నీ
మోదమునాదు భాగ్యములు మూలమెరింగిన తండ్రినీవె నా
మీద ప్రియంబుగల్గినను మేలుగ నేలికృతార్థజేయ నీ
పాదములాశ్రయించితి కృపామతి శ్రీవరదా మహాప్రభో. 48

సాధులరక్షణార్థమును సంపదనీయెడ నిండియుండ నీ
పాదసరోజయుగ్మముల పారభవంబులు బారదోలు న
న్సోదరభావము ల్జెలగజూచితిరంబుగ నీప్రసాద స
బద్బోధనసత్ఫలంబొసగు పుణ్యము శ్రీవరదా మహాప్రభో. 49

మతిగలవాడగాను బతిమాలితినిత్యము నీదయామృతం
బతిమహిమంబుగల్గినది బంధచయంబు దొలంగజేయునే
సతతము వేడుకొంటి దయసాగర పాపహరాముదంబున
న్నతితుని జేసిగావు నిజబంధుత శ్రీవరదా మహాప్రభో. 50

నీటిని దేలుబుగ్గవలె నీల్గెడికాయము పెంచుచుంటి నా
నాటికినీదలంపుమది నాటకప్రాకృతమందు మూల్గియుం
కేటికినాశమాతనువు కీలెరిగించిముదంబొసంగు నా
మేటివి నీవెగాదె భువిమేలగు శ్రీవరదా మహాప్రభో. 51

కాయమువ్యర్థమాయె బలుకాకితెరంగున బాలిమూర్ఖుడై
మాయప్రపంచభోగముల మానకగోరివసించియుంటి నీ
సోయగమైచెలంగు ముఖసుందరమెంచి నుతించనైతి నీ
న్బాయకబ్రోవనీవెగతి పావన శ్రీవరదా మహాప్రభో. 52

ఇలసుఖభోగమొంద జగమింపగుగోధన ధాన్యసంపద
ల్చెలగు విశాలగేహములు జేరిన భూషణ మంబరంబులు
న్గలుగనొసంగు వారెవరు కారణభూతుడు నీవెదేవయిం
పలరుచునన్ను బ్రోవతగు బాంధవ శ్రీవరదా మహాప్రభో. 53

ఖచరులు భూచరుల్జలని కాయులు నాకసవాసులందరు
న్వాసభవదీయ సత్కరుణవెల్గు సుధంబది గ్రోలిసంపద
ల్పసగలవారలై యునికిపట్టున భోగము బొందిరయ్య నా
దెసదయజూచిగావు మిక దేవుడు శ్రీవరదా మహాప్రభో. 54

జలధరదేహము న్విజయశంఖము చక్రముల్ధరించి యిం
పలరవిధేయుల న్మిగులపాలనజేయు కరంబులందమ
ల్కులుకుచువచ్చు లక్ష్మికుచకుంకుమ పూతవిలాసనంపద
ల్చెలగముదంబు నేలుననుజేకొని శ్రీవరదా మహాప్రభో. 55

మలయజగంధి నీరమణిమర్మ మెరుంగు నటంచు నీవు దా
బిలిచి విశాలవక్షమున బెట్టిప్రియంబుగ ముద్దులాడుచు
న్జెలగు భవత్ప్రితాపముల జెప్పనశక్తుడ నేలునీకృప
న్తిలకమహానుభావ కడుదీనుడ శ్రీవరదా మహాప్రభో. 56

నల్లనిదేహకాంతి నయనంబులచందము లిందొనర్చు నీ
తెల్లనిబొట్టువర్ణముల దీప్తికిరీటమకూలనుద్భుతం
బుల్లమునంతసంబొదవు భూరమణా ననుగానలేక యీ
పల్లమునందు ద్రోయనిదిభావ్యమె శ్రీవరదా మహాప్రభో. 57

సారసనేత్ర మిత్రభవసాగరమందున మున్గుచుండె ననే
జేరభవత్ప్రసాదమును సేవయొసంగి శుభంబులొందనీ
దారియుజూపిగావుమను దండముదండము దేవదేవ ని
న్గోరినుతింతునెల్లపుడు కూరిమి శ్రీవరదా మహాప్రభో. 58

రమణిమనోభిరామ జయరామ సనాతననామ రావణా
ధమకులభీమ హేమతనుదామ జితేంద్రియకామవామనా
విమలదయాబ్ధిసోమ రణవీరచయంబులనేమ నీదయా
రమణతనీప్సితంబొసగు రాజవు శ్రీవరదా మహాప్రభో. 59

ఘనమగు నీప్రభావములు గన్గొనసాతరమా రమాప్రియా
మనవిని చిత్తగించి నవమానసమూహము సంహరించి నీ
యనుపమశక్తిఁ జూపి విజయంబు లొసంగుము వేదవేద్య నే
వినయముతోడ వేడితిని వేమరు శ్రీవరదా మహాప్రభో. 60

నమ్మితి నెల్లకాలముల నాప్రియతల్లియు తండ్రివర్గము
ల్సమ్మతమైన నేస్తకుల జాలము నీవె యటంచు వేడి నే
నిమ్ముగ నిచ్చు విన్నపము నెల్ల ముదంబుగ జూచి సత్ఫలం
బిమ్ము సదానుతింతు భవభేదన శ్రీవరదా మహాప్రభో. 61

ఇచ్చినదాత నీవనుచు నెంచి కుతూహలమొంది గొల్తు నీ
సచ్చరితంబులన్ పొగడ జాలినవాడనుగాను క్రోధమ
నచ్చను గెల్చి నీదుపద రాజ్యము బొందుమదీయ భాగ్యము
న్మెచ్చుటలొందగావు జగమోహన శ్రీవరదా మహాప్రభో. 62

మరువక నెల్లకాలముల మంచి భవత్సముఖంబు నందు నే
తిరముగ నిల్చి గొల్చితిని తీవ్రము నాభవజాల మన్నియు
న్సురుచిర శారదోలి వరసూరిజనంబుల నేలుభాతి స
ద్వరము లొసంగుమయ్య సురవందిత శ్రీవరదా మహాప్రభో. 63

తిరుపము బొందలేక తనదేలివదంబడి దెల్పవచ్చిన
న్గురిగలయాకుచేలునికి గొబ్బున సంపదలిచ్చినట్టి నీ
వరమదయా ప్రభావములు పద్మభవుండు నెరుంగజాలఁడే
త్తరినను గావు మాలివిధధర్మ శ్రీవరదా మహాప్రభో. 64

భీకల రక్షణానుగుణ పెంపువహించు కృపాసముద్ర నా
వేదన నీమనంబెరుగు విశ్వప్రభుండవు సారసాక్ష యీ
బాధలబొందలేక నిను పల్మరుగోరి నుతించివచ్చితి
న్గాదెపరాకుమానినను గావుము శ్రీవరదా మహాప్రభో. 65

నను దిగులొందజేసితివి నాధుడు నీవని నమ్మియుండగా
ఘనమిదెసర్వమున్నెరుగు కారణమూర్తివి నీదయామృతం
బున శుభమొందగావలయు భూమిచరాచరజంతుజాలము
ల్గనుక ప్రియంబొసంగి మరిగావుము శ్రీవరదా మహాప్రభో.66

చింతనవల్ల నీవలచేతనవర్గము వృద్ధిబొందగా
నంతటనిండియుండి తరుణంబున గోరుఫలంబులన్నియు
న్వింతగనిచ్చి నేలుదువు వేదమునందు వసించునాధ యీ
పంతము నేలబ్రోవ నను పండిత శ్రీవరదా మహాప్రభో. 67

పండిత నీదయామృతము పానమొసంగి చెలంగజేయుమా
ఖండలసన్నుతాంగ నరకాసురభంగ విహంగ వాహనా
మండలమందు నీసుగుణమార్గప్రభావము లేమిచెప్పుదు
న్కొండిగనయ్యాగావునను గోరితి శ్రీవరదా మహాప్రభో. 68

గోరి నుతించితిన్మిగులకూరిమి నాయెడ జూపి పేర్మియిం
పారనొసంగి సత్ఫలము పాలనజేయుమునాధనాధ నీ
భావములన్ని భూరమణ భక్తపరాయణ దీనరక్షణా
నేరములెంచగా వలదు నిర్మల శ్రీవరదా మహాప్రభో. 69

నిర్మలమైన సచ్చరిత నిర్జరదాత ప్రభోదదాత నీ
ధర్మస్వరూప సాహసముదారగుణాకర మేమిజెప్పుదున్
మర్మమెఱుంగుధీనిధి సమానులు లేనిమహేశయాశ స
త్కర్మము నన్నుబ్రోవ తగుకాంతుడ శ్రీవరదా మహాప్రభో. 70

కాంతుడ నీవెఱుంగుదువు కాలస్వభావము తెల్లగాన నీ
శాంతస్వరూపముల్చెలగ చయ్యనజూచి ముదంబొసంగు వే
దాంతవిశాలసద్గుణ నిధానప్రధానచరిత్రగోత్ర రా
ధాంతమదేల నేలనెరదాతవు శ్రీవరదా మహాప్రభో. 71

దాతయిదేటిటింత నిను ధర్మస్వభావుడనంగ నమ్మి నా
మాతపితానుజాతతులు మార్గమునీవె యటంచునుంటి నీ
భూత దయారసంబు నను బొందగయుండుట నీకిగాదు నా
భూతము నీవె నేలుము ప్రభుండగు శ్రీవరదా మహాప్రభో. 72

ప్రభుడవు యెల్లజీవులకు ప్రాభవమొప్ప విహంగమెక్కి యీ
త్రిభువనముల్చరించిగల రీతులెరింగి సమస్తజీవులన్
శుభములు బొందజేయుదువు శోభనమూర్తివనాధనాధ స
ద్విభవము లిచ్చినేలుకొను వేగమె శ్రీవరదా మహాప్రభో. 73

వేగమెసంగు సత్ఫలమువిన్నపము వ్విని సంతసంబునన్
సాగినమస్కరింతును విశాలయశంబులుబొంద నీవు నా
గోగణగోపజాతములు గొల్వనగంబుధరించి గావవే
నీగుణమెన్న నాతరమె నిత్యము శ్రీవరదా మహాప్రభో. 74

నిత్యము నీపదాంబుజము నేనెరనమ్మి స్మరించువాడ నీ
పుత్యపుహారములెల్లెలగ మోదముతోఁ జనదొరచి నీదుసాం
గత్యప్రతిప్రయోజనము గన్పడసత్ఫలమిచ్చి నేలుమా
సత్యము వేడు భక్తకళలసన్నుత శ్రీవరదా మహాప్రభో. 75

సన్నుత నీదుసత్కరుణ సంపదలిమ్మనటంచు యిచ్చు నా
విన్నప మాలకించి కడువేడుకగా నను జూచిగావుమా
పన్నగభూషణా ప్రియుడ బంధవిమోచనసుందరాన నా
తిన్నగనేలుమా గొలుతుధీరుడ శ్రీవరదా మహాప్రభో. 76

ధీరుడు నీవుగాన భువి దేవ నుతించి నతిక్రమించు భూ
భారము దీర్ప వేడిన శుభంబొనగూర్పదలంచి మించి స
ద్భారతమా చరిత్రమున పాలనజేసితివయ్య నేర్పునన్
వారిజనాభ గావు నను వందిత శ్రీవరదా మహాప్రభో. 77

వందిత నీదుపాదముల వాసవుడర్చనజేసి యింపుగా
బొందె సురేంద్రపట్టమును బూని విశాలబవత్ప్రభావము
ల్పొంది యెరుంగనావశమె సంభ్రమలీల దయార్ద్రతంబును
న్పొంది జెలంగ నీవెగతి భూవర శ్రీవరదా మహాప్రభో. 78

భూవర యేమిజెప్పుదును బొందుగ నొక్కలలాముచిల్కకు
న్పావన రామనామమును భక్తిగబెట్టి ముదంబు బిల్చినన్
దేవరవారు సంతసిలి దివ్యపదంబొనగూర్చినట్లు నీ
భావముజేత గావు నను బాలుడ శ్రీవరదా మహాప్రభో. 79

బాలుని పెంచ తల్లి బహుభంగుల నారసి సత్ప్రియంబునన్
పాలన జేయు నాకరణి భారము నీదెగదా ఫలప్రదా
కాలము మంచిదయ్య నను గావవరాశ్వర గోరిదెల్పెదన్
జాలము సేయుటల్లగదు సంభ్రమ శ్రీవరదా మహాప్రభో. 80
సంభ్రమ మొప్ప నీచరితసారము చాల వినంగ నిత్యమున్
సంభ్రమమబ్బు నీసుగుణసంపద లెంచి నుతించు వారికిన్
సంభ్రమ మెచ్చు భోజకులచంద్ర మహాద్భుతమైన నీదయా
సంభ్రమమిచ్చి గావుననుచయ్యన శ్రీవరదా మహాప్రభో.81
చయ్యన వచ్చి నేలుటకు జాలినమూర్తి వటంచు రుక్మిణీ
నెయ్యమునొక్క బ్రహ్మకుల నేర్పరి నీకడబంపె ప్రీతిగా
వియ్యములంది గాచితివి వేల్పులు మెచ్చనునాదునీప్సితం
బియ్యసదా నుతింతునిరు పేదను శ్రీవరదా మహాప్రభో. 82
పేదనను గ్రహించుటకు పెన్నిధి నీవె ధరాతలంబునన్
మోదితులైన రాధిపుల మోహముగా భువనంబు లేలుట
ల్మీధు ప్రసాదవైభవము నిత్యము నాయెడ ప్రీతిజూపి నీ
వాదముమానిగావు మిక వాసవ శ్రీవరదా మహాప్రభో. 83
వాసవవందితా గొలుచు వారలగాచు యశోవిశాలనీ
భాసురమైన సాహస మపారము జెప్పగ నాది శేషుడే
వీసము జేయ నేనుప్పృధివీపతి నీదయగల్గి జెప్పితిన్
దాసుడనయ్య గావుననుదాతవు శ్రీవరదా మహాప్రభో. 84
దాతవు గోరువారలకు దండిగ నీప్సితమిచ్చి గాచు సం
జాతములోన నీకెవరు జాలరు పాలనమూర్తి జూడగా

పాతరలాడు నీకరుణ పాత్రునిజేయుము నన్ను నీవు నీ
దాతగుణంబుల న్వరుస దప్పక శ్రీవరదామహాప్రభో. 85

తప్పక నేల గావలయు దాసులతప్పక దండమైనచో
నొప్పగు నీలవర్ణ వదినూరుల దండము బెట్టినట్టి నా
తప్పు క్షమించి మంచిసముదాయఫలంబు లొసంగుమయ్యనీ
విప్పుడె జాలమేలనిక వేడితి శ్రీవరదా మహాప్రభో. 86

వేడినవారికెల్ల మదివింతహితంబు లొసంగి నేల నీ
కీడుమ రెవ్వరీభువిని కేళివిలాసభవాద్భుతంబులన్
జూడప్రధానమై చెలగు చూపరులువ్వెళులూరుగాదె నీ
వాడనుగావు మోదమునవర్తిలు శ్రీవరదామహాప్రభో. 87

వర్తిలుశక్తియందు విభవంబగు భూవలయంబులెల్ల నీ
మూర్తిస్వరూపముల్గనని ముద్దులగుమ్మ మెరుంగు ప్రేమ సం
కీర్తినమోదితా విమలకీర్తి విశాలదయాలవాల నా
ప్రార్థన మాలకించు పరిపాలన శ్రీవరదా మహాప్రభో. 88

పాలనశక్తి గల్గి వరబంగరు మేడలనుండి మేలుగా
చేలముగట్టి గప్పికయి జేసిన భూనగరంబు లుండినన్
చాలభవత్ప్రసాదమను సారమొకింతయు లేక రాజుగా
జాలడు యిమ్ము సత్కరుణసాగర శ్రీవరదామహాప్రభో. 89

సాగరమెల్ల జూడగను చక్కని గట్టుది లేక నిల్చుట
త్మేఘములెల్ల యింద్రునికి మీరిచరించక నుండుటెల్ల నా
మోఘభవత్ప్రతాప గుణమూలముగాదె సుధాకరాననా
వేగమె నన్నుబ్రోవు రఘువీరుడ శ్రీవరదామహాప్రభో. 90

రఘువర వంశవర్ధనుడ రాజుల రాజవిరాళమొందు నీ
సుగుణవిలాస సంపదలు సుందరమైన ముఖారవిందము
ల్నిగమ మెరుంగు నా కలతనేర్పుగ దీర్పుము తాళజాలనే
వగచు టెరుంగ వేమ ప వాడనె శ్రీవరదామహాప్రభో. 91
వగగలవానితమ్మునికి కపా ము గా చనువిచ్చి రాజ్యమున్
జగములెరుంగ నిచ్చితివి శంకర మిత్రయి దేటి చిత్రమో
తగుదువు సర్వములోనగి తప్పక నాకలిదీర్చి నేలుమా
నగధర సుందరా విబుధనాయక శ్రీవరదామహాప్రభో. 92
నాయకమై ధరాతలమునం గల వారిఫలంబు లిచ్చు సం
ధాయక న్యాయసత్ప్రియ విధానమెరింగి వరాకు మానినన్
బాయకనుండి సత్కగుణ పాలనజేయుము రాఘవేంద్ర నీ
మాయ మెరుంగ నాతరమె మానిత శ్రీవరదామహాప్రభో. 93
మానితసద్గుణాకర రమామణి ధారణ కారణాప్రియం
బూని యొసంగుమా వరము పుణ్యచరిత్ర విచిత్రభూషణా
దానవమర్ధనా భువన ఈండిని నా మొర నాలకింపుమా
దీన శరణ్య మేలొదవు దేవుడ శ్రీవరదామహాప్రభో. 94
దేవుడ నీపదాంబుజము దీప్తితిరంబు భవాబ్ధిదాటగా
నావగు నీకరంబులు ఘనంబగు నక్షయపాత్రమయ్యె నీ
భావము సర్వసంపదలపార మొసంగెడి కామధేనువౌ
గావు సమస్తప్రాణముల కర్తవు శ్రీవరదామహాప్రభో. 95
కర్తవు జీవులందరికి కామితమిచ్చి చెలంగు తండ్రి నీ
వర్తనమెల్ల నద్భుతము వర్ణనజేయతరంబుగాదు సం

పూర్తిహితంబుచే గలుగు భోగమొసంగుము నన్ను నేలినీ
నర్తనమేల మానుమిక నమ్మితి శ్రీవరదా మహాప్రభో. 96
నమ్మి కిరాతకాంత విపినంబుచరించి ఫలంబులెల్ల దా
నిమ్ముగదెచ్చి ప్రేమముగ నీకొసంగగ మహాముదంబుగా
సమ్మతిచేతవుచ్చుకొని సత్కృపజూపి చెలంగినావు నా
నమ్మికజూచి గావు జగనాధుడ శ్రీవరదా మహాప్రభో. 97
నాధ వరాకుమానుము సనాతనగోత్ర పవిత్ర మిత్ర
బోధనచేత తారకము బొంద వివేకములిచ్చి నామనో
గాధనుగూర్చి సంతసముగల్గి సుఖింపగజేసి వేగ నా
భాధనుమాన్పిగావుముశుభంబుగ శ్రీవరదామహాప్రభో. 98
శుభమగు నీదు పద్యముల జూచి పఠించినవిన్నవారలున్
విభవ మహాకటాక్షమున విశ్వయశంబులబొందియింపుగా
నభమకు స్వర్గభోగము ఘనంబుగ జెందిచరింత్రుదేవకి నా
కభయమొసంగుమోదమునకారణ శ్రీవరదామహాప్రభో.
కారణ నీదయామృతము గల్గి రచించితినాదరింపుమా
గారవ చిల్కబల్కులను గన్గొని ప్రీతిగ నాలకించు శృం
గారము రీతిసాధుగుణగణ్య భవచ్చరణంబు నమ్మితిన్
కూరిమినేలు మేలుగనగోచర శ్రీవరదా మహాప్రభో. 100

వరదరాజశతకము

సంపూర్ణము.

రామమోహన ముద్రాక్షరశాల, రాజమండ్రి—1936.

# శ్రీకృష్ణలీలాతరఙ్గిణి

నా రా య ణ తీర్థ ప్ర ణీ త ము.

(తాత్పర్యసహితము.)

సోదరా!

రసమయాత్మకములు కావ్యములు. రసములు తొమ్మిది. వానికి శృంగారరసము నాయకమణి. దాని మూర్తిత్వమే కృష్ణరూపము. ఆప్రభుని లీలలు వర్ణించిన కవులు చాల తక్కువ. ఈగ్రంథమునందు గ్రంథకర్త భక్తులకు శ్రీకృష్ణజననము, బాల్యచేష్టలు, శైశవక్రీడలు, కాళియమర్దనము, గోపికా వస్త్రాపహరణము, గోవర్ధనోద్ధరణము, గోపికలకు తత్త్వోపదేశంబు చేయుట, రాసక్రీడలు, రాధాకృష్ణ సంవాదము, గోపికాగీతలు, కంసవధ, భ్రమరగీతలు, రుక్మిణీ కల్యాణము, కృష్ణుండు జాంబవతి మొదలగు నష్టభార్యలను పెండ్లాడుట కన్నులకు గట్టినట్లు వర్ణించినాఁడు. నీ వెన్నిపాపంబులు చేసినను తరింపయత్నించు నుపాయము వెదుక వనుమాట కల్ల. కృష్ణనామస్మరణము ముక్తిదాయకమని నీస్నేహితులను నచ్చచెప్పఁ దలంచితివేని కృష్ణలీలాతరంగిణిం జూపుము.

వెల రు 0-

# గీతగోవిందము

(ఆంధ్రపద్య తాత్పర్యసహితము.)

రసికాగ్రేసరా!

గీతగోవింద మను నీగ్రంథరాజమును రచించిన మహాకవి కృష్ణదాసజయదేవుఁడు. ఇందలి గీతల కెనిమిదేసి పాదము లుండుటచే అష్టపదు లన్నారు. త్యాగరాజు, క్షేత్రయ్య, జయదేవుఁడు తెనుఁగునాడులోఁ బుట్టి తెనుఁగుప్రాపకము లేక ద్రావిడదేశమున జీవనంబుల నిలుపుకొని తమ యసాధారణ భక్తిపారవశ్యమున లోకమున దిగంతకీర్తి నందినారు. జయదేవుఁడు శృంగారమున వేదాంతమును మేళవించి నారికేళపాకమున నీయష్టపదుల నష్టకష్టములఁ బడి సారస్వతలోకమున కర్పించినాఁడు. శ్లోకములు రసగుళికలు. పద్యము లాధునికములయ్యు రసవంతములుగ నున్నవి. ఈగీతములను వేణుమూలమున నా బాలగోపాలుఁడే పాడిన రాధనలపు మఱేరీతి నుండునో! జయదేవుని గీతములు ఉత్తరదేశంబుననే ప్రచారములో నున్నవి గాని యాంధ్రదేశమునఁ బ్రచారమున లేవన్న నపవాదను తీర్పుము. మచ్చున కొక్కపద్యము.

శ్లో. కంసారి రపి సంసార వాసనాబద్ధశృంఖలాం।
రాధా మాధాయ హృదయే తత్యాజ వ్రజసుందరీం॥

గీ. వరుఁడు సంసారవాసనా • బద్ధశృంఖ
లాకృతిని రాధ నెంచి ము • గ్ధాలి వదలి
ప్రేమునఁ బొంత నందందుతా • నరసి మదన
నార్తి మాధవుఁ డిట్లు • సారెవనుచు.

వెల రు **0—8—0**